అంకితం

సినిమా నటనతోపాటు

జీవితస్థాయిని పెంచుకొంటున్న

# శ్రీ గుమ్మడి వెంకటేశ్వర రావు

గారికి

సహృదయులకు.

కథాత్మకంగా నేను వ్రాసిన కావ్యాలలో ఇది మూడవది; కాగా శృంగార స్పర్శలేకుండా వ్రాసిన వాటిలో మొట్టమొదటిది.

ఇతివృత్తం చాలావరకు చారిత్రకం. ఒకానొక ప్రాచీన కవిచే వ్యావహారికంలో వ్రాయబడిన 'తంజాపురాంధ్ర రాజుల చరిత్ర' నుండి, ఈ వస్తువును తీసుకున్నాను. కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారీ గ్రంథాన్ని పరిష్కరించి ప్రకటించినారు. శ్రీకురుగంటి సీతారామయ్య గారి తంజాపుర నాయకరాజుల చరిత్రలో గూడా ఈ కథ ప్రస్తావించబడింది.

అయితే, కావ్యసౌందర్యం దృష్ట్యా ఈ కథలో అక్కడక్కడ చిన్న చిన్న మార్పులు చేయవలసి వచ్చింది. విశ్వనాథనాయని జనన వృత్తాంతం, ఈ గ్రంథాలలో కానరాదు. అయినా, ఉత్తరోత్తర కథకు పుష్టిని సమకూర్చగలదన్న అభిప్రాయంతో, నేను పెంచి వ్రాసినాను.

అలాగే విశ్వనాథ నాయని తల్లి ప్రసక్తిగూడా ఇంతవరకెక్కడా కానరాదు. ఆమె పేరు సైతం తెలియదు. నేను ఆమె

కరణంగూడ చేసినాను. చారిత్రకాంశాలకు భిన్నంకాని మార్గంలో కావ్యౌచిత్యానికి భంగంకలుగని రీతిలో - ఇలాంటి మార్పులు, ఒకటి రెండు చేయడం జరిగింది.

మామూలుగా నేను వ్రాసే మాత్రాచ్ఛందస్సులోనే ఈ కావ్యాన్ని వ్రాసినాను. అయినా ఈసారి అంత్యనియమాలను అట్టేప్రవేశపెట్ట లేదు. గతివైవిధ్యాన్ని గూడా అంతగా పాటించలేదు. అయితే ప్రసిద్ధమైన, ఖండగతి, మిశ్రగతి, త్రిశ్రగతులను బహుళంగా వాడుకొన్నాను. చతురశ్రగతిని క్వాచిత్కంగా వాడుకొన్నాను.

తెలుగువారికి అంతగా సుపరిచితంకాని ఈ కథను కావ్య బద్ధంచేసి. తెలుగువారందరికీ సుపరిచితులైన శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారికి అంకితమిస్తున్నాను. చలనచిత్రరంగంలో, విభిన్న పాత్ర నిర్వహణ దక్షుడైన శ్రీ గుమ్మడి, ఉత్తమనటుడు మాత్రమేకాదు. ఉదాత్త భావుకుడు కూడ. కళలూ సాహిత్యమూ, అంటే కరిగిపోయే రసహృదయుడాయన.

రెండు మూడేండ్ల క్రిందట, ఆప్తమిత్రుడు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి ద్వారా శ్రీ గుమ్మడితో నాకు పరిచయం కలిగింది. నాటినుండి క్రమంగా అది పల్లవించి, కుట్మలించి, కుసుమించి, నేడు ఫలోన్ముఖమయింది. ఆ ప్రగాఢ స్నేహాను

న్నాను, సహృదయతతో వారిందుకంగీకరించడం నాకు హృదయ పర్వంగా ఉంది.

ఈ గ్రంథ ముద్రణలో నాకు చేదోడుగా ఉన్న గూడూరి సీతారాంకు, ముఖ పత్రం మీది అక్షరాలను వ్రాసిన మిత్రులు బలరామాచార్యులు గారికి నాకృతజ్ఞతలు. —సెలవు

మీ వాడు

నారాయణరెడ్డి

# ప్రథమ ఖండం

సూర్యావతరణ ప్రచురణార్థ సమయ సం
భృత శంఖమన మింట వేగు చుక్క వెలింగె.

ప్రాచీసతీ ముఖాబ్జమ్ము పైన సుఖప్ర
సూత్యనంతర వికాసోల్బణత భాసించె.

తుంగభద్రా జలతరంగ డోలల నూగు
బుడుత గాడుపుల సవ్వడులు దవ్వుల వీచె.

ప్రత్యూష పవనమాలల నెయ్య మందికొని
గోక్షీర పరిమళాంకురములు తరలి వచ్చె.

సంఘృష్ట కాంతి నిర్ఘర విఘాతములతో
చిట్లి పోయినవి చీకట్ల కూకటివ్రేళ్ళు.

రేఖాకృతులుగ చీలిన యెఱ్ఱడాళ్ళు క
న్పడెను నెత్తుట తడిసినట్టి బల్లెములట్లు.

కృకవాకు కూజితప్రకరముల్ లోకబాం
ధవు రాకదెల్పు వైతాళికశ్రుతులయ్యె.

ఆ యమ్మ్నుత వేళ విద్యానగర మానంద
మూర్తి యయ్యెను స్తన్యముగ్ధశిశువు విధాన.

నగరి వెలుపలి విశ్వనాథ మందిరము క
న్పడె నప్పుడు సమాధి విడిన యోగీంద్రువలె.

గాలి కల్లలనాడు ఆలయ ధ్వజ ఘంటి
కల నుండి సైత మోంకారమే ధ్వనియించె.

ద్వార మందున నిల్చి తేరి చూచెడి వారి
కగుపించు విషధరుడు అమృతరుక్ శేఖరుడు.

కర్పూర చందనాగరు ధూపములతోడ
పరిమళించినది మందిరములో ప్రత్యణువు.

స్వామి సన్నిధిని సాంజలులై కబళితాశ్రు
జలులై నిలంబడిరి జంపతులు మౌనులై.

అతడు నాగమనాయ; డా సతీమణి మల్లి
కాంబ; వారలు పుత్రకాంక్షా కలిత మతులు.

కృష్ణరాయల యశోగీతి సంచాలకుం
డై అతని కుడిభుజమ్మై యొప్పె నాయండు.

ప్రాయ మింతింత పైబడెను; వంశాంకురము
కరవయ్యెనని బిట్టు కళవళించె నతండు.

కోటి దేవతల మ్రొక్కులు దీర్చి కడ కతడు
తన బ్రతుకు విశ్వనాథునికై జన్నియగట్టె.

అతని వేదన ఊర్ధ్వమైసాగి ప్రభుకర్ణ
మూలముల మూగి మార్మ్రోగె నీ చందాన.

"నా స్వామి ! విశ్వనాథ !
నయనీకృత శైవాత్మక !
సారించుము నీ అమృత
స్యంది కటాక్షాంకురమ్ము.

ఈషణత్రయమ్ముపై ర
మించదు నా మనసంతగ.
కాని ఒక్క పుత్రేషణ
కకావికలు జేసె నన్ను.

గుప్పించితి కైదువులను
నొప్పించితి రిపు నృపులను.
మెప్పించితి కృష్ణరాయ
మేదినీంద్ర మూర్ధన్యుని.

రత్నస్థగితములగు హ
ర్మ్య శ్రేణులు కట్టించితి.
గాదెలలో బంగరు టం
కములు నిల్వబోయించితి.

ఇన్నియుండి ఒక్క పుత్రు
డన్నవాడు లేనినాడు
బూడిదలో పన్నీరై
పోయెగదా నా సర్వము.

సంపదలకు పొంగుదునా ?
సంతుకొరకు క్రుంగుదునా ?
స్వామీ ! నా గతి యయ్యెను
చక్రవాళ పర్వతమటు.

ఇటు ఐహిక సుఖములేక
అటు ఆముష్మికము లేక
రెంటికి చెడియుంటి నుద్ధ
రించవయా దయామయా!"

ఈదృశమ్మైన ఆత్మీయ బాధా లహరి
గుడుసుళ్ళువడి గర్భగుడిలోన ధ్వనియించె.

మల్లికాంబా సామి ఫుల్లాధరము పైన
ఎవియొ మౌనధ్వనులు కువకువలు పోయినవి.

ఆమె వేదన ఆర్ద్రమై స్వామి వామ పా
దాంభోజమున బంభరాయితమ్మై పొల్చె.

"నాతండ్రీ! విశ్వనాథ !
నగతనయా ప్రాణనాథ!
ఈ నా గోడ్రాలి బ్రతుకు
కే నాడయ్యా విముక్తి ?

నోచితి నెన్నో నోముల
చూచితి తీర్థముల నెల్ల
కాని నా కనుల వెన్నెల
కూన మోసులెత్త దాయె.

నీవు పెంచినట్టి పూల
తీవె యింత కాలమయ్యె;
నొక్క పిందెయైన వేయ
దెక్కడి అన్యాయమ్మిది ?

'అమ్మా' యని పిల్చెడు క
న్నయ్యను గుండెలు చేపగ
కౌగిలించుకొను భాగ్యము
కలదా నాకీ జన్మకు ?

కడుపున చుమ్మలు జుట్టెను
జడీభూతమయ్యె తనువు.
ఈ బ్రతుకు నెడారిని పం
డించెడు భారము నీదే".

దంపతుల పుత్ర సంతానార్తి ద్విముఖమ్ము
గా లేచి చివరి కేకముఖమ్ముగా వీచె.

మల్లికాంబయు నాగమవిభుండును శివార్పి
త వచశ్శరీర చేతస్కులై నారపుడు.

వారి చుట్టున్న పరివారమ్ము సర్వమ్ము
తేలియాడెను దివ్యతేజ స్సరసిలోన.

దంపతుల చతురంతరములం దంతలో
శంపాలతా సహస్రము చకాసితమయ్యె.

గర్భగుడిలోని జేగంటలు తమంత తా
మే గణాగణమంచు మ్రోగెను విచిత్రముగ.

ధ్యానముద్రా భద్రులై నిల్చు దంపతులు
కలయజూచిరి చలాచలిత లోచనులౌచు.

తమ యెదుటనున్న చంద్ర కళావతంసు క
న్నులలోన పాలవెన్నెల పొంగు లగుపించె.

తమపైన రణన రమ్యములైన జేగంట
లా స్వామి ఆశీరవాక్కృతులె యనిపించె.

సాంబ్రాణి ధూపముల సౌరభమ్ములు మూడు
నాల్గింతలౌచు ఘ్రాణ మహోత్సవము జేసె.

తమ పురాజన్మ సుకృతము పంట కెదిగిన
ట్లనుభూతి జెంది రాత్రుణములో దంపతులు.
రెండు దోసిళ్ళ నతులిడె విశ్వనాథునికి
రెండు తనువులు మోకరిలె విశ్వనాథునికి.
రెండెదలు తుహినాంశురేఖాధరాశీస్సు
మ పరిమళ ప్రవాహ పునీతములు నయ్యె.
పరిజనులు వెంటరా బయలుదేరెను నాగ
మవిభుండు మల్లికాంబా సమేతుండౌచు.

ఆలయ దేహళిని దాటి
అత డుదయ దిశాంకిత వీ
క్షుణుడయ్యెను; కాంతి సుధా
స్నానధౌత తనుడయ్యెను.

వెలుతురు పొత్తిళ్ళలోన
కిలకిలమని నవ్వుచున్న
బాల సూర్యబింబమ్మును
ఆలోకించెను నాయడు.

గూటినుండి వెల్వడి చిరు
కొమ్మమీద కూర్చొని తన
నిసుగు చుంచు దువ్వెడు పెం
టిని జూచెను మల్లికాంబ.

ఇరువు రొండొరుల మొగముల
వీక్షించిరి మౌనముగా.
ఇరువురు నిట్టూర్పులు నిగు
డించిరి పరిదీనముగా.

తలలు వాంచి అలనల్లన
తరలిరి తమ యింటివైపు.
మనసులు మాత్రమ్ము స్వామి
మందిరమ్ము చుట్టు తిరిగె.

గుడిలో తను కనుల చెదర
గొట్టిన తేజోఽనుభూతి
మనన రమ్యమై నాయని
మదిలో మారాకు దొడిగె.

చివరికి కార్తాంతికులను
చేరబిల్చి యెరిగించెను
ఆలయమ్ములోని ఘటన
యంత పూస గ్రుచ్చినట్లు.

వారున్నమిత భ్రువులై
స్మేరానన మనస్కులై
'జగదేక మహా వీరుడు
జనన మొందు' నని పల్కిరి.

తన నోములు ఫలియించెడు
తరుణ మ్మేతెంచెనంచు
మల్లికాంబ మదిని పాల
వెల్లులు పరవళ్ళు ద్రొక్కె.

జోస్యులు చెప్పిన ఫలితము
స్ఫురణకు రాగా నాయని
యిరు బుజములు పొంగు; వెంట
నే యేమో యనుచు క్రుంగు.

ఈ విధిని నాయండు పుత్ర ప
రీప్సలో లిప్సను దినమ్మొగ
నీడ్వ; నాతని నూరడించగ
నేగుదెంచెను కృష్ణరాయలు.

తన గృహానకు మేరుశిఖరము
తరలివచ్చిన యటుల పొంగుచు
ఆతిథేయమ్మొసగి రాజ స
మక్షమున నిల్చుండె నాయడు.

పులకిత హాస్తుడు భక్తిభావ
స్ఫుటముఖుం డైనట్టి నాయని
చేరదీసి భుజమ్ము దువ్వి వ
చించె నీగతి కృష్ణభూపతి.

"నాగమా ! తెలిసినది నీ సం
తాన చింతా క్రాంతన స్థితి.
కడుపు తీపు సహించు టన్నది
కడు అలౌకికమైన సంగతి.

ఎగుడు దిగుడులు ఇరులు వెల్తురు
లెవరికోయీ ? మానవులకే.
కలిమిగల యింటనె ఫలించవు
కడుపు; లిదియే సృష్టి చిత్రము.

ప్రాణికోటికి మోహగుణ మా
జాన మైనది మేము కాదన;
మైన నది నీబోటి ధీరుల
కల్పకాలికమే కదా మరి.

మొన్న కోవెలలోని ఘటనము
విన్నవించిరి అస్మదాప్తులు.
విశ్వనాథుని చంద్రరేఖా
విలసనమ్మే వేరు కాదది.

బాలచంద్రుని వంటి కొడుకును
బడసెదవు డీల్వడకుమోయీ !
క్రమముగా నీ బ్రతుకు శారద
కౌముదుల పండించునోయీ !"

కృష్ణరాయ శిరీష మృదులో
క్తి ప్రసారము నాగమయ్యకు
వరుసగా అక్షతలు కురిసిన
కరణిగా అనుభావ్య మయ్యెను.

ఆసనోత్థితుడై చెమర్చిన
అక్షియుగళము మోడ్చి పబ్బతి
బట్టి కించిద్గద్గదికతో
పల్క దొడగెను నాయడిట్టుల.

"ఓ ప్రభూ ! మీ నుడులు అచ్చపు
కప్రపుం బోడులై మదీయ దు
రంత సంతాపమ్ము నార్పెను
ఆశలను చిగిరింప జేసెను.

కదన రంగములందు నా యెద
కత్తికంటె కరాళమైనది.
కాని సంతానార్తితో కసు
గంది పసచెడి పేదవడినది.

పుత్రవాంఛా ముగ్ధమతినై
పొగిలి పోయెడు నాకు మీ నుడు
లచ్చముగ గీతోపదేశ
మ్మటుల ధృతిదాయకము లయ్యెను.

నేటినుండియె మీదు వాక్స్వర
జిన్ యథావిధిగా చరించెద.
ఎడదలో బడబాగ్ని దాచిన
కడలినై మనుగడను పెంచెద."

తన వినమ్ర వచో విధాన
మ్మునకు తనిసిన కృష్ణరాయల
సాగనంపి అపూర్వ సత్త్వ
స్థాయి నారోహించె నాయడు.

కొలువు కేగును రాజ్యతంత్ర
మ్ములకు తన మతి నప్పగించును.
అపుడపుడు నిద్రించు సంతా
నార్తి నపుడే సంయమించును.

ఇటుల గడచెను దివస బహుళము.
ఎగిసి పోయెను పక్షయుగళము.
తిరిగిపోయెను రెండు నెలలు అ
తీంద్రియ త్వరణ ప్రవణమై.

నిప్పులను పుకిలించు గ్రీష్మము
నీడపోలిక జారిపోయెను.
చల్లబడియెను లోకమట్టుల
మల్లికాంబా తప్త హృదయము.

చినుకు పడియెను; ఆవులింతల
ఫణితిగా ఆవిరులు లేచెను.
మల్లికాంబిక సస్యగర్భ
మైమ్రన ధారణివోలె తోచెను.

పొరలసాగెను ఆమె ఉదరము
పొరలలో ఆషాఢమేఘము.
మబ్బువట్టిన నింగిక్రింది నె
మళ్ళ వలె ఆడిరి వయస్యలు.

మిన్ను కురిసిన యటుల నాయని
కన్ను లానందమును కురిసెను.
అతని యెదలో ఒకటిగాదు స
హస్ర సురచాపములు విరిసెను.

మల్లికాంబ ముఖమ్ము లోధ్రసు
మమ్ము చెల్వును సుంక మడిగెను.
మల్లికాంబ ముఖమ్ము మృత్స్నా
మాధురులతో వియ్యమందెను.

ఆమె లోపల చంద్రభూషణు
నంశ యెదుగుచు నున్నదోయన
మేని నిండుగ అచ్చ వెన్నెల
మిసిమి వన్నెలు దుసికిలించెను.

ఆమె కడుపున అష్టమూర్తి ధ
రాంశ మోసులువారెనో యన
సారె సారెకు మట్టి దిను వాం
ఛావిశేషము కోరకించెను.

ఆమె నడకలు కర్మయోగి హృ
దంతర స్థితి ననుకరించెను.
ఆమె ఊహాము లా కుమార
స్వామి చుట్టు ప్రదక్షిణించెను.

క్రమముగా దోహద వికార
గ్లాని మాయగ నామె కాంతిలె
జీర్ణ పర్ణమ్ములను రాలిచి
చిగురులెత్తిన తీగపోలిక.

జరిగె పుంసవనాదిక క్రియ;
లరిగె నవమాసమ్ము లంతట.
నాగమయ్య హృదంత ముత్కం
ఠా వివశమై త్రొక్కులాడెను.

'అమ్మగారికి ప్రసవవేదన'
లంచు పరిచారికలు దెల్పగ
వెలుగు నీడలమధ్య నాగమ
విభుని చిత్తమ్మాగి పోయెను.

ఇంత చీమ చిటుక్కుమన్నను
'ఏమియే' మని తొందరించును.
దాసి యెవ్వతె కన్పడిన 'ఏ
మే సమాచార' మని యడుగును.

ఇంతలో నొక దాసి ప్రసవ గృ
హాంతరమ్మును వెడలి వచ్చెను.
ఊపిరులు బిగబట్టి నాయం
డొకటి రెండడుగులు గమించెను.

'దాటె గండము; దేవరకు ర
త్నమ్ము వంటి కుమారు' డని యా
దాసి పల్కెనో లేదో నాయని
తనువు పున్నమ కడలి యయ్యెను.

అపుడె నాయని వక్షమున హ
ర్షాశ్రుమాల తళుక్కు మనియెను.
అపుడె దాసి కరాగ్రముల ము
త్యాల దండ జిగేలు మనియెను.

నాయనికి పుత్రోదయమ్మని
నగరమెల్లను పొంగిపోయెను.
వేడుకలతో విరిసి నాయని
మేడ పూవై తేలిపోయెను.

ముత్యమ్ములతో ముగ్గులు వెట్టిరి
ముకుర తోరణము లెల్లెడ గట్టిరి.
చిత్ర విచిత్ర పటాంచలములతో
సింగారించిరి మణిసౌధమ్మును.

ధరాపాలకులు చమూనాయకులు
అరుదెంచిరి తమ అరదమ్ములపై.
శతాంగ తురంగ వితాన రింఖా
హాతిన్ కుతిలపడె ఘంటాధ్వమ్ములు.

శ్రీమంతులు కాన్కలు చదివించిరి.
సామంతులు కట్నములను పంపిరి.
పండిత గణ్యులు కవి మూర్ధన్యులు
పద్యగేయ సుమమాలిక లంపిరి.

కంచిగుబ్బెతలు మధురాగణికలు
కదలిరి మదనుని కడాని బాకులు
అచ్చరలటుల వియచ్చరలట్టుల
కుచ్చెళ్ళూగగ ఆడిరి పాడిరి.

డప్పుల చప్పుడు డమరుధ్వనులు క
కుప్పుల వీనుల త్రుప్పును డుల్చెను.
పటహ మృదంగ స్ఫుట ప్రణాదా
ర్భటుల్ నభమ్మున పెటిల్లుమనియెను.

నాయని సుతజన్మోత్సవ మిటులిం
ద్ర వైభవమ్మును స్మరింపజేసెను.
రాయలు వేడుకలందున విజయము
చేయగ ఉత్సవశోభలు మించెను.

సకల బంధుమిత్ర సమ
క్షములో నాగమ నాయడు
తన సుతునికి విశ్వనాథు
డని నామకరణము జేసె.

విశ్వనాథ కృపాజలధి
వీచికయై జన్మించెను
గాన నట్టి పేరు సార్థ
కమ్మని తలలూచి రెల్ల.

సుత జన్మోత్సవ సంరం
భ తిరోహిత నిఖిలాన్య
వ్యాపృతియై నాయడు హ
ర్షాంభోధిని పుడిసిలించె.

తన యొడిలో కిలకిలమను
తనయుని గని మల్లికాంబ
గుండియతోపాటు కనులు
గూడ చేపులెత్తుచుండె.

లేక లేక కన్న తమ్మి
రేకుల కన్నులవాడా
దంపతుల మనస్సుల కోక
దాశరథిగ వెలుగోందెను.



# ద్వితీయ ఖండం

వటపత్రమున విష్ణు వటుల పచ్చల పైడి
తొట్లెలో విశ్వనాథుండు నిదురంబోవు.

పాలనురుగులు పెదవిమూలల గుబాళింప
కనులు గిల్పక ఊర్ధ్వగతి దృష్టి సారించు.

తనను జూడంగ వచ్చిన వారిపై ఆణి
ముత్యాలు జల్లు నొక బోసినవ్వును దూసి.

తూగాడు తొట్లెలో తొణకాడ డొక్కింత
సంసార చక్రమున సమదర్శి చందమున.

కాల్సేతు లిట్టట్టు కదలించు చిట్టెమ్ము
గట్టిన అధర్మమును నెట్టివేసిన యట్లు.

కేరింత లిడుచు పిడికిళ్ళు వట్టును భవి
ష్యద్దైవరిలక్ష్మి హస్తగ్రహణ సూచనగ.

తననీడ తానెరుంగని వాని నపహాసిం
చెనో యనగ దీపమ్ముగని కిలాకిలనవ్వు.

భవ మెరుంగని శివప్రభుమూర్తి పసితనపు
చవిగోరి పాపడుగ జన్మించె ననిపించె.

పసిడి కింకిణులు తుంపెసలాడ మోకాళ్ళ
పై నడుచు సుతుడు కన్పడ మురిసిపడు తండ్రి.

ఆత్మజుని ముద్దాడినపుడెల్ల అమృతాభి
షేకమైనటుల భాసించు నాతని మదికి.

నిల్చుండబోయి అటనే తొట్రుపడిన కొడు
కును గుండెలదర గొమ్మున కద్దుకొను తల్లి.

దాదు లెందరోయున్న తప్పించుకొని వాకి
టం జేరు - ఔను మూటను నిల్చునా గాలి?

బిరబిరా పర్విడి గుభిల్లునన్ కూలి వెం
టనె యెగిసిపోవు క్రీడాకందుకము లీల.

తన మనస్సునకు నచ్చని బొమ్మ లపరంజి
వైనను సరే వాని నాతల విసిరికొట్టు.

తన మనస్సునకు నచ్చిన మట్టి బొమ్మలను
కనుల కద్దుకొను భూకాంతత్వ మచ్చుపడ.

అంకురము పల్లవితమైనట్లు విశ్వనా
థుడు శైశవస్థితిని గడచి బాల్యము నందె.

తనతోటి కుర్రవారిని చేరదీసి మహా
లదరిపడ సరిక్రొత్త ఆటలాడుచునుండె.

శ్రీకారమును మొదల్ చేసి ఒకయేడు గడు
వక మున్నె తిక్కన్న భారతము వల్లించె.

పాఠమ్ములం దాటపాటలందును కుమా
ర ప్రతిభ నేత్రయుగళము వోలె వికసిల్లె.

కర్ర నొక్కటి బట్టి కత్తివలె జళిపించు
కుర్ర నొక్కని బిల్చి గుర్రమని అదలించు.

ఇంక కొందరిని రప్పించి మొగ్గరములను
పన్ని 'కో' యని యార్చి పైబడి చెదరగొట్టు.

హుమ్మంచు మెట్లపైనుండి క్రిందికి దూకు
కోట కొమ్ముల నుండి కుప్పించెనో యనగ.

జనని కౌగిట ఆకుచాటు పిందియ వోలె
గడపినట్టి దినాలు కరగిపోయిన వంత.

క్రమముగా పితృ సమక్షమున ఖడ్గాది శ
స్త్ర ప్రయోగ విధా కుశల హస్తుడైపోయె.

అస్త్ర ప్రయోగ సమయమునందు విశ్వనా
థుని లోన రాజస ద్యుతులు పొంపిరివోవు.

కావ్య పఠన రసాత్త కాలమున విశ్వనా
థునిలోన సత్త్వమ్ము ధునులు ధునులై పారు.

ప్రహ్లాద చరితమ్ము పఠియించు నపుడు క
న్నులలోన అశ్రు కీలలు శాంతముగ మండు.

భారతములో రాయబారంపు ఘట్టమును
తరచి పొందును రాజ్యతంత్ర విద్యానిధులు.

మొలక మీసంపు నిగ్గులనాడె విశ్వనా
థుడు తండ్రినే మించు కొడుకంచు పేరొందె.

వత్సము మహర్ష భత్వమ్ము దాల్చిన యట్లు
అత డుదితయౌవనుండై విరాజిలుచుండె.

పార్వణ చంద్ర జ్యోత్స్న
పర్యాయమ్మైన విశ్వ
నాథ కీర్తి రాయల డెం
దమ్ములోన సురభిళించె.

విశ్వనాథు డెప్పుడు క
న్పించిన రాయల కేవో
క్రొత్త యూపిరులను చేది
కొన్నయట్టు లనిపించును.

తనలో క్రేళ్ళురికెడు కాం
క్షను కొన్నాళ్ళణచి యుంచి
చివరికి నాగమనాయని
చేరబిల్చి యెరిగించెను.

సగము నెరసిపోయిన మీ
సములందున తొలిటి ప్రా
యము తళుక్కుమనగ సమ్మ
దాశ్రులు రాల్చెను నాయుడు.

నాటి దినము నుండి విశ్వ
నాథుడు రాయల సేనా
పతియై ద్విగుణీకృత శో
భా పరిణత యశుడయ్యెను.

నడిపించెను చమూ తరం
గముల నష్ట దిఙ్ముఖముల.
చెండాడెను అరివీరుల
శిరస్సులను బంతుల వలె.

తుత్తునియలు చేసెను గిరి
దుర్గ ప్రాకారమ్ముల.
పిండిగొట్టి మారొడ్డిన
పృతనా చతురంగమ్ముల.

చేతిదెబ్బతోడ పగి
ల్చెను మదేభ కుంభమ్ముల.
హుంకారముతో మరల్చె
ఉద్రిక్త తురంగమ్ముల.

కట్టుగ్రముగా రేగిన
కారు దున్నపోతులతో
కలయంబడి మెడల్ విరిచె
కాళిక మెయి గగుర్పొడువ.

జాగ్రన్నిజ శౌర్యాగ్నికి
సమిధలుగా జేసి రిపుల ;
అన్ని దెసల రాయల విజ
యాంకములను హత్తించెను.

ఆజ్యముచేత హుతాశను
డటుల విశ్వనాథుని వి
క్రాంతి సాహసమ్ము వలన
క్రమ పరిణామము నొందెను.

దినదిన వర్ధిష్ణువైన
తనయుని కీర్తిని గని నా
గమనాయని కొక సహస్ర
గజముల సత్తువ పెరిగెను.

అరువదేండ్లు తన తలపై
ఒరిగిపోయినన్ నాయని
అంతరమున ఆకుపచ్చ
నౌ ఊహలు సందడించె.

తన కొమరుని బహుముఖ ప్ర
తాపమ్ము విశృంఖలమై
విజృంభించు తరుణము న
న్వేషింపగ సాగె నతడు.

అంతటి తన విశ్వనాథు
డెంత కాలమని రాయల
నీడలోన ఒదిగి ఒదిగి
నిల్చునని వితర్కించెను.

మకుటధారి కావలసిన
మనిషి డొక దళవాయిగ
బ్రతుకుటయా యంచు కుటిల
పాటును జెందెను నాయుడు.

ఎన్నడు తన విశ్వనాథు
డేలిక యౌనోయను ఉ
త్కంఠ యెదను కెల్కుచుండ
గా కాలము నీదుచుండె.

సత్త్వ రజోగుణముల కా
స్థానమైన నాయని మది
క్షణములోన తామస రే
ఖా మలీమస మ్మయ్యెను.

ఇటుల కొన్ని దినాలు గడువగ
ఘటన యొక్కటి జరిగె వింతగ.
పొరద్రోలెను చోళభూపతి
పాండ్యభూపతి నక్రమమ్ముగ.

కృష్ణరాయల కంటి చల్వల
నిగురులిడు సామంతు లిర్వురు.
కాని వారల నడుమ వచ్చని
గడ్డివేసిన భగ్నమనియను.

చోళరాజాక్రాంత నిజరా
జ్యుడు హతాశుడు చంద్రశేఖర
పాండ్యు డంతట కృష్ణరాయల
పంచలో తల దాచుకొనియెను.

కన్ను మిన్నును గనని చోళుని
కండకావర మణచి తన రా
జ్యమ్ము తన కిప్పించుమని రా
యలకు పాండ్యుడు వినతి చేసెను.

పాండ్య భూపతి కోర్కె ధర్మ ని
బద్ధమైనది గాన చోళుని
ఉక్కణంచెదనంచు అభయ
మ్మొసగె దీనావనుడు రాయడు.

మర్మమెరిగిన మంత్రియౌ తి
మ్మరుసుతో మంతనము లాడెను.
కత్తి కెదురుగ వజ్రధారయె
కడు సమర్థమ్మంచు నెంచెను.

ఖండన క్షేత్రమ్ములన్ తల
పండిపోయినయట్టి నాగమ
నాయని భుజార్గళముపై సం
గ్రామ ఘనభారమ్ము మోపెను.

నాయుడా భారమును కుసుమ
ప్రాయముగ నంగీకరించెను.
శిరసు నించుక వంచి రాయల
సెలవు గైకొని నిష్క్రమించెను.

అతనిలో గుడుసుళ్ళువడు అ
త్యాశ ఒక్కుమ్మడిగ లేచెను.
ఒక్క తొల్కరివానతో పై
కుబికివచ్చు శిలీంధ్ర మట్టుల.

ఇంతకాలము దేనికై మి
ర్రెక్కి చూచెనో తాను, నేడది
తీరవచ్చెను; వెదుకబోయిన
తీగ కాలికి తగిలినట్లుగ.

రాజ కార్యముతోడ తీరును
నైజకార్యము ; చోళరాజును
తరిమికొట్టుటతోడ పాండ్యుని
చరిత సైతము చెరిగిపోవును.

తంజపురియును మధుర నగరియు
తనకు క్రీడా నందనములగు.
తన కుమారుడు విశ్వనాథుడు
దక్షిణాపథ సార్వభౌముడు.

ఇట్టి వక్రోహ పరంపర
లిర్లు కొనుచుండంగ నాయడు
పడగలో విషమును కుదించిన
పన్నగస్థితి నాక్రమించెను.

అతని వీడ్కొల్పుటకు తనయుం
డనుసరించెను ; కాని నాయడు
కుబుస మూడని తన మొగమ్మును
కొడుకునకు చూపించ వెరచెను.

మింట నిల్చెడు పర్వతాగ్రము
వంటి నాగమనాయ డిప్పుడు
లోయలో దిగజారె నౌరా !
లోభ మెంతటి చిత్రమైనది.



# తృతీయ ఖండం

భువన విజయ భవనాగ్ర
మ్మున రాయలు కవితా గో
ష్ఠీపరుడై యుండగ వ
చ్చెను పాండ్యాగమన వార్త.

తనతో అప్పాజీ మా
త్రమ్మె నిల్చియుండ పాండ్య
నరపతి నభ్యంతర మం
దిరమునందు రప్పించెను.

ఝంఝానిల సముద్ధూత
శరన్మేఘ శకలమువలె
అరుదెంచెడు పాండ్యుని గని
అబ్రపడెను రాజేంద్రుడు.

కుశల ప్రశ్నాదుల కొక
కొంచెమైన తావీయక
రుషా విషాదాత్మక స్వ
రుండై పాండ్యుం డిట్లనె.

"సామంతుల పాలి సుర
క్ష్మారుహమై మీరుండగ
మహాప్రభూ ! ఇంత అధ
ర్మమెట్టుల జరిగెనయ్యా !

నాగమ నాయుండు చోళ
నరపాలుని పారద్రోలి
నా గద్దియపై కూర్చు
న్నాడు నన్ను సీత్కరించి.

మీ రంపిన బంటే న
న్నీ రీతి పదభ్రష్టుని
జేసెను ; కంచెయే చేను
మేసిన దిక్కెవ్వరింక.

మిమ్ము నమ్ముకొనియుంటిని.
మీ చూపుల పందిరిలో
గద్దె నిల్పుకొంటి ; నింత
గతి యాయెగదా చివరికి.

ధర్మ పక్షపాతియైన
తమకు నొక్క చెప్పదగిన
దేమున్నది ? మీ నిర్ణయ
మేదైనను తల దాల్తును."

పాండ్యరాజు దీనాలా
పమ్ముల నాకర్ణించిన
క్షణకాలము రాయలు వి
స్మయగ్రస్తుడై యుండెను.

క్రమక్రమముగా నాతని
కంటికొనలు జేగురింప
అప్రాజిని గాంచి నిగ్ర
హమును ప్రోదిజేసుకొనెను.

ముందుగ తా లేచి పాండ్య
భూపాలుని వెన్ను జరచి
అతనిచేయి తన హస్తము
నందు నిల్కొని నిమిరెను.

రాయల హస్తస్పర్శను
రక్షామణిగా గ్రహించి
పాండ్య నృపాలుండు రొమ్ము
పై చేయిడి నిదురవోయె.

ఆ నాటి నిశామధ్యము
నందున విశ్వనాథునికి
తెలిసిపోయె శంపాఝుటి
తిగ నీ వృత్తాంతమంత.

తటి తరళాంతఃకరుండయ్యెను.
పిమ్మట లజ్జావిషాద
పిహిత చేతస్కుండయ్యెను.

ఇన్నినాళ్ళు తా జూచిన
కన్నతండ్రియేనా యీ
దుర్గుణ జంబాలమ్మున
దూరెనని వితర్కించెను.

"అరువదేండ్ల మచ్చలేని
చరితముగల ధీరు డిట్టి
కసుమాలపు పనికెట్టుల
కచ్చెగట్టెనో తెలియదు.

కోరిక లుడిగిన వయస్సు
లో రాజ్యమ్మెందుకొ నా
ఊహాకందద; దైనను వ్యా
మోహమునకు వయసేమిటి ?

తనకు రాజ్యలోభమున్న
దను సంగతి యింతవరకు
నాకు తెలియనీయ; డిదం
తయు తనకో నా కొరకో.

ఒకనినోరు గొట్టి గడిం
చుక తెచ్చిన తుచ్ఛరాజ్య
మునకే ననుభోక్త నంచు
అనుకొనుటే సిగ్గుచేటు.

ఇపుడు తెలిసె; చైత్రయాత్ర
కేగునపుడు నాన్నగారి
మొగములోన మసకవన్నె
పొగలెందుకు ముసిరినవో.

నాన్నగారిలో తమో గు
ణమ్ము పడగ విప్పుచుండ
గోవువంటి అమ్మ కాదు
కూడదనక యెటులుండెను?

ఉండియుండి నాన్న యెట్టి
ఉక్కివమును తలపెట్టెను.
కత్తెరయని తెలిసికూడ
కుత్తుక ముందుకు నెట్టెను.

పలిక యానతిని ధిక్క
రించుట క్షంతవ్యమ్మా?
తిన్నయింటి వాసమ్ముల
నెన్నిన యంతటి ద్రోహము."

యెల్ల ముండ్లపై పయన్న
యట్లుగడపె విశ్వనాథు ;
డధర్మ భీతాంతరుండు.

మరుసటిదినమున జంఘా
లురను పిలిచి రాయలు 'నా
గమనాయని వెంటనె ర'
మ్మని ఉత్తరువులు పంపెను.

రాజాజ్ఞను విని నాయుడు
రవ్వంత చలించె గాని
మరు నిముసమునందె అహం
భావము తీండ్రించిపోయె.

తనలోపల బుస్సున లే
చిన దురాశ మరుగుపరచి
సమాచారమంపె వచన
చాతుర్యము తులకించగ.

వార్తావహు లందించిన
ప్రత్యుత్తర పత్రమ్మును
చదువుకొనెను రాయలు తన
మదిలో నెమ్మదిగనిట్లు.

"కర్ణాటాధీశ్వరులకు
కై మోడ్పులతో నాగమ
నాయం డొనరించెడు వి
జ్ఞాపన మిది యేమనగా -

అయ్యా ! దయతో దేవర
యంపిన వృత్తాంతమందె.
దారుణమది ప్రభూ ! నాకు
తలదీసిన యట్టులయ్యె.

చిన్ననాటి బంటునైన
నన్ను సురాళించుటేమి ?
మొనమొన్నటి పాండ్యునిపై
మురిపెము గురిపించుటేమి ?

తమ యానతి మేరకు చో
ళుని బింకమ్మణచి వాని
తరిమికొట్టినాడ మధుర
సరిహద్దులు దాటువరకు.

చెల్లాచెదరౌ పాండ్య
శ్రీకి సిగను ముడిచినాడ.
మంటలెగయు దేశమ్మున
మల్లెలు పండించినాడ.

నెటుల రాజ్యమర్పింతునను
చేనుగాంచి నక్కలపాల్
జేయు వెర్రివాడెవ్వడు ?

ఏ పాండ్యునిపైనో కురి
పించెడు వాత్సల్యమాత్రం ?
ఒకసగమీ బంటుపైన
ఒలికించిన దోషమేమి ?

తమ సేవనలో బ్రతుకులు
ధారవోసినట్టి మేము
ఈమాత్రము ఫలమ్మనుభ
వించుటకైనను తగమా ?

అంతదాక యెందుకు రా
జ్యమ్ము వీరభోజ్యమ్మని
తమకు తెలియనట్టి రాజ
ధర్మమ్మా.

ఉప్పెనవలె పొంగెడు కో
పోద్రేకముతో రాయలు
ముగియక ముందే ఉత్తర
మును బ్రరున చించివైచె.

నాయన పరుషోక్తులతో
రాయల ధీరస్వాంతము
అంకుశమును చూపెట్టిన
ఐరావత మట్టులయ్యె.

కటము లదర, కుటిల భ్రూ
కుటులు చెదర ; ముహుర్ముహు
స్ఫుటితోగ్ర శ్వాసముండై
పటు హుంకారము చేసెను.

హుంకారము కన్నను అ
త్యుద్ధతమ్ములౌ ఊహలు
రాయల మది మొరసెను గ
ర్జిలమించిన మెరుపులట్లు.

ఏదో వజ్రసంకల్పము
పదును వారగా నాతడు
శమియించె ; ఉదాత్తుల కో
పము క్షణికమే కద !

కొలువుదీర్చెను కృష్ణరాయ
క్షోణిపాలుడు ; నాడు నాయని
జాతకమ్మెట్లు మారునోయని
సభ్యులెల్లరు వేచియుండిరి.

మంతులును క్రిక్కిరిసి యుండిరి.
వారిలో [illegible] శిఖరమటు క
న్పడె నిరీహుడు విశ్వనాథుడు.

కొలువులో కలకలము మూగెను.
నిలిచెనంతట కృష్ణరాయలు.
వెంటనే ఆస్థానమంతయు
వింజమాకిడి నట్టులయ్యెను.

కొలువుకూటము కలయజూచి ర
గుల్కొనెడు కసినార్చికొంచును
ప్రావృడంభోద స్వరమ్మున
పలికెనిటు కృష్ణక్షితీంద్రుడు.

"అందరెరిగినదే కదా నా
యందు చూపిన వక్రధోరణి.
కాదు నిన్నటినాయు ; డతనికి
నేడు కన్నులు నెత్తికెక్కెను.

వృద్ధుడని మన్నించి పీఠము
వెట్టినందుకు మమ్మె కాదను
దాక వచ్చెను ; ఎంతలోపల
ఏకుమేకై పోయె నౌరా !

మోహమెదొ క్రమ్మి రాజ
ద్రోహమునకై కాలుద్రవ్విన
వాడు మనకాప్తుండె యైనను
వధ్యుడే - ఇది ధర్మమార్గము.

నాయడింతకు ప్రభుద్రోహ మొ
నర్చె ; ఆతని రెండురెక్కలు
గట్టి తీసుకవచ్చి యిట నిల
బెట్టు జెట్టి యెవండొ తెల్పుడు.'

నిమిష కాలము కొలువులో వి
న్పించె గుజగుజ ; లంతలోనే
క్రమ్ముకొని యెను సాంద్రనైశ్శ
బ్ద్యమ్ము గాటపు మంచుతెరవలె.

సభాస్తారుల చూపులే సన
సన్నగా మూల్గినవి; వారల
యెడద లందున దడదడల సం
దడలు సుడివడి పోవుచుండెను.

పెద్దపులి మీసముల నెవ్వడు
పెరికి వేయగ సాహసించును.
అగ్ని పర్వత శృంగమున నడ
యాడగా నెవ్వడు తెగించును.

ఎరిసి యురిమెను కృష్ణరాయలు
నిర్జనారణ్యమ్ములో కం
ఠీరవము గర్జించి నట్టుల.

ఇంతలో తరుణస్వరము వి
న్పించె 'మన్నానో ప్రభూ!' యని;
గంట గొట్టిన యట్టుల సభా
గారమందది ప్రతినదించెను.

సభ్యలోకమ్మెల్ల అద్భుత
చలితమై ఆ వైపె చూచెను.
కృష్ణరాయ దృగంచలు మాలలు
కృష్యమాణము లయ్యె నాదెస.

కొలువులో అప్పుడప్పుడె ముసిరిన
కలకలములో 'విశ్వనాథుడు
విశ్వనాథుం' డనెడు శబ్దము
విన్పడియె నవ్యక్తరుతిలో.

కన్ను బొమ్మలు కించిదూర్ధ్వము
గా చలించగ 'విశ్వనాథా!
నీ స్వరమ్మెనా' యనుచు ప్ర
శ్నించె కృష్ణ ధరాధినాథుడు.

ఆసనోత్థితుడై అచంచల
మైన కంఠస్వరముతో 'ఔ
నౌను నేనే యంటి' ననె; కొలు
వంత తనువులు చెవులుగా వినె.

విశ్వనాథుని ఉత్తరమునకు
విస్మితుండై రాయడిట్లనె
"కన్నతండ్రి నెదిర్చుటకునై
కచ్చె గట్టితివా కుమారా!

విశ్వనాథా! నీ మగంటిమి
విదితమీ పరిషత్తు; కైనను
పరుల చెండుట వేరు తండ్రిని
పట్టితెచ్చుట వేరు సుమ్మా!

మునులు సైతము రాగబంధ
మ్ములను త్రెంచగ లేరు; నీవో
పడుచు ప్రాయపు మిసిమిసల్ గల
వాడ - విది నీ కెట్లు సాధ్యము ?

తండ్రి కొడుకులు గలిసి మాపై
దండయాత్రను జేతురని శం
కించుచున్నా నంచు నెంచకు.
ఎరుగుదును నీ యెడదలోతును.

ఇంత సాహస కార్యమున్నది
చరితలో క్వాచిత్కమే; నీ
చర్య జగతికి క్రొత్త పాఠము."

కృష్ణరాయల వాక్కులకు నో
క్కింతయైనను చలనమందక
నిలిచియుండెను నిస్తరంగిత
నీరధింబలె విశ్వనాథుడు.

సెలవులందున మొలక నవ్వులు
చిందులాడగ; కన్నులందున
భక్తి భావము చెమ్మగిల్లగ
బదులు పల్కదొడంగె నాతడు.

"ప్రభువులకు ప్రత్యుత్తరమ్మిడు
పాటి మేటిని గాను — ఐనను
మనసులోపలి మాట వెలి బు
చ్చనిదె శాంతిని పొంద జాలను.

ఇందరుండగ నేనె నడుము బి
గించుటేలని యందురా ? ఇది
స్వామికార్యము; ఎవరొ యొక్కరు
సాహసించక తప్పదు గదా.

కన్నతండ్రి యటన్న నెవ్వడు
కరగిపోవడు ? కాని స్వామీ !
ధర్మదండము బూనినప్పుడు
తండ్రి యెవ్వడు ? తనయు డెవ్వడు ?

నాన్నపన్నిన ద్రోహచింతన
నాకు తెలిసిన నాటగోలెను
గుండెపై కూర్చుండె నొకపెను
గొండ; నేడది తేలికయ్యెను.

ఫలాసక్తిని విడి ఋజు క
ర్మలను జేయుట శిష్టమార్గము
వెలిగిపోవుటలోనె బ్రతుకును
వెచ్చపెట్టిన దీపమట్టుల.

స్తుతులకో సమ్మతులకో యీ
ప్రతిన బూనగలేదు ; ధర్మ
క్షుతిని జూడగలేక ధ్వజమె
త్తితిని నను దీవించుము ప్రభూ !"

విశ్వనాథుని ధర్మదీక్షా
శాశ్వత సుధోక్తులకు కృష్ణ ధ
రాతలేంద్రునితోడ నిఖిల స
భాతలము పులకించిపోయెను.

చున్న పాండ్యుని గుండెలోతుల
నశ్రునీరము లూరిపొంగుచు
అతిగోళములందు నిండెను.

కంఠమున గద్గదిక కించి
త్కముగ దోపగ కృష్ణరాయలు
విశ్వనాథుని శిరసుపై కురి
పించె దీవన పూలజల్లులు.

కొలువు చాలించెను ప్రభుండు ని
గూఢవేదన తీపులెత్తగ.
వెడలిపోయిరి సభాస్తారులు
ఎడందలు బరువెక్కిపోవగ.

ఒక్కమారు కవోష్ణముగ ని
ట్టూర్చి జవనాశ్వమ్ము నెక్కి హు
టాహుటిగ పయనించె పురఘం
టాపథమ్ముల విశ్వనాథుడు.



# చతుర్థ ఖండం

విశ్వనాథుని కోష్ణనిశ్వాసములు సహ
స్ర గుణీకృతములైన పగిది గ్రీష్మమువచ్చె.

అతని చతురంగ సైన్యముల ప్రస్థాన ధూ
ళులు నభశ్చలిత ఝంఝులకు సైదోడయ్యె.

సుడిగాడుపుల కెగిరిపడు దవానల దగ్ధ
శేషపత్రము లతని చిత్తవృత్తిని చాటె.

అతని సుతిమెత్తఊహలు మండుటెండలకు
మొనలువాడిన మల్లెమొగ్గలను తలపించె.

కానలందున కొండకోనలందున నీటి
తడియారినటు నోటితడియారె నాతనికి.

ఒక్కొక్కమారతని ఊహములు మధ్యాహ్న
మార్తాండ కిరణసంపదల కేరడమాడె.

ఒక్కొక్కమారతని ఊహములు చల్వలను
పుకిలించు చలివేంద్రలకు అప్పులిప్పించె.

ధర్మమున కాత్మయితకు జరుగు రారాపి
డికి అతని లేతగుండియ రణక్షితియయ్యె.

తుదకు ధర్మైకచిత్తుండై కటికిరాత్రు
లను మండిపడుపగళ్ళను చీల్చుకొనిసాగె.

కొన్నినాళ్ళకు చేరుకొనె మధుర ; నగరి బై
ట శతాధికమ్ముగ గుడారములు వేయించె.

తనతండ్రిపైకి కత్తినిదూసి విశ్వనా
థుడువచ్చెనని నగర ముడికిపోయినదంత.

ఆనాడె నిజాగమన స
మాచారము ; తత్కారణ
మంతయు వ్రాయించి తండ్రి
కంపెను విశ్వనాథుండు.

అమాంతముగ పిడుగువడ్డ
యట్టులడలి ఆక్రోశిం
చెను నాయడు ; ఏకసుతాం
కిత జీవన సర్వస్వుడు.

జివ్వన ప్రాణమ్ములు కుం
చించుకొనగ మల్లికాంబ
కదలిపోయె రివ్వను చలి
గాలికి తలిరాకువోలె.

కలయో నిజమో తెలియని
బలితమ్మగు కలతలోన
నాయుడు వెర్రెత్తినట్లు
లై యనె నిజపత్నితోడ.

"ఎంతటి విపరీతమ్మిది
ఎక్కడైన ఎప్పుడైన
కనిపెంచినవారిపైన
కత్తిగట్టెనా సుతుండు ?

కనులనిల్పుకొని యీ కు
ర్రని పోషించితిమిగదే !
మొన్నటి కీనాటికి క్రొ
మ్ములు మొల్చెగదా పినికి.

ఎన్నటివాడే సరిగా
ఇరువదేండ్లు నిండలేదు.
ఇంతలోనె తానొక్కని
యంతనని తలంచెనేమొ ?

మనసీడను పెరిగె తుదకు
మనపైనే కాలుదువ్వె
బుద్ధితీర ద్రావి లేగ
పొదుగును గ్రుద్దినయట్టుల.

ఎన్నియాతనలను పొందితి
కన్నామే యీ కుర్రని.
అన్నిమరచినాడా రా
యల మెప్పుల వలపోసెద.

జోస్యులు కుర్రని హస్తము
జూచి రాజయోగమనిరన్న.
దన్న పల్కులన్ని కల్ల
లై పోవుటయేనా యిది ?

ఇంత జేసి యెవనికోస
మే ? కన్నకుమారుండే
పగవాడై పోయిన యీ
బ్రతుకు చట్టుబండలకా ?

బదులు పల్కవేమే ? ఈ
యెద కోత భరించలేను.
ఇట్టిదుర్గతిని గనుముం
దే చచ్చిన బాగుండును."

గొంతులోన డగ్గుత్తిక
దొంతరలెత్తగ ఇంకను
పలుకలేక నాయుడు బా
ష్పములను టపటప రాల్చెను.

మల్లికాంబ తన యెదలో
మల్లడిగొను దుఃఖమణచి
పట్టలేక విభునిపైన
బడి భోరున విలపించెను.

ఇరువురిటుల ఉమ్మగిల్లు
ఎడదలతో; ఉరిసిపోవు
కన్నులతో; కొంత సేపు
కాలమ్మును కరగించిరి.

విశ్వనాథు డచటికి పం
పిన రాయసకాడు మంద
మందస్వరమున వారిని
మందలించి ఊరార్చెను.

ఇంక గడియ సేపయ్యెను.
ఏమియు పల్కడు నాయుడు.
'అయ్యో! ప్రత్యుత్తరమే'
మని రాయసకా డడిగెను.

అశ్రుజలధిలోన మునక
లాడెడు నాయడు హఠాత్తు
గా తేరుకొని రెప్పలార్చి
కలయజూచె నలువైపుల.

తన సమక్షమందు సమా
ధాన నిరీషాగ్రమాన
సుండగు రాజసాజ్ఞిని
జూచి భగ్గుమని మండెను.

ఇంత సేపు తనలో మొల
కెత్తిన ఆర్ద్రత యుడిగెను.
పడగెత్తెను మమకారము
బదులుగా అహంకారము.

సర్వశక్తు లొక్కమారు
సమీకృతములై లేచెను.
నిద్రాణ భుజాదర్పము
నిలిచి యొడల్ విదలించెను.

ఆవేశాంధుండై తుద
కంపెను ప్రత్యుత్తరపత్రి
'ప్రాణము పోయినగాని
పాండ్యరాజ్య మివ్వ'ననుచు.

విశ్వనాథు డీ వార్తను
విన్నంతనె మూకీకృత
చేతస్కుండై కుంచితా
క్షిద్వయుడై నిల్చిపోయె.

'క్షణములోన తెప్పరిల్లి
స్వాంతము వివశమ్మైపో
గా ; గిర్రున నేలదిరుగ
గా ; దిక్కులు చూడసాగె.

'సాహసముతో ప్రభుకార్యము
సాధించక పోవుదునా
యని యెంచితి ; చివరి కింత
లాయెగదా' యని వగచెను.

"పేరుకు సైన్యమ్ములు నడి
పించుక వచ్చితిని; నాన్న
యింతకు తెగియించు నంచు
నే నెన్నడు దలచనైతి.

పూసగ్రుచ్చినటు సర్వము
వ్రాసి పంపితిని నాన్నకు.
సత్త్వమూర్తి కెట్టి తామ
సమ్ము దాపురించెనయో !

కాసంతటి ఔదార్యము
కనబరచిన బాగుండును.
గోటితోడ పోవుపనికి
గొడ్డలి కావలసి వచ్చె.

దాయలతోనే యుద్ధము
సేయగ జంకెను కిరీటి.
కన్నతండ్రిపైనే నేను
కత్తిని జళిపించజాలను.

తండ్రియంచు వెనుదీసిన
ధర్మభ్రష్టుడ నౌదును.
ధర్మచ్యుతికన్న నేరి
దారుణ పాపమ్మేది ?

పితరుని పైనే కత్తిని
పెరికిన విద్రోహియంచు
లోకము దూషింపనిమ్ము
నాకీ గరళము తప్పదు".

ఇటుల వగచి వగచి గుండె
దిటవు పరచుకొని తండ్రికి
'దయతో యుద్ధమునకు సి
ద్ధము' కమ్మని కబురంపెను.

యుద్ధవార్త తన చెవులం
దురిమి పోవగా నాయుడు
మొదలు నరుకబడ్డ వృక్ష
ము విధమ్మున కూలిపోయె.

మల్లికాంబ కురిసిన క
న్నీళ్ళతో ముసలి నాయని
తనువులోన ఎప్పటి చై
తన్యము రేకులు విప్పెను.

తనయునివైనము చేతోం
తరమున ఘూర్ణిల్లిపోవ
అతడు తోకద్రొక్కిన త్రా
చై ఘూంత్కారము జేసెను.

"జేనెడు కుర్రడు యుద్ధము
సేయగ తలపడెనా ?
తాటాకుల చప్పుళ్ళకు
దడిసెద ననుకొనెనా ?

నా పంజాదెబ్బల కెదు
రై పోరంగలడా?
నా కత్తుల తళత్తళల
కాక కోర్వగలడా?

గుహాలోపలి సింగమ్మును
కుదిలించిన వాడు
ప్రాణమ్ములతో నెట్టుల
బయటికి పోగలడు"?

ఈగతి రౌద్ర ప్రసంగము
తో గర్జించెను నా గని
కరాళాకృతిని గని గజ
గజ లాడెను పట్టపురాణి.

వెక్కి వెక్కి యేడ్చుచు గని
విభుని పాదములపై బడి
తునాథునకైన ప్రణయము
తో నిట్టుల ప్రార్థించెను.

"ఏమి మాటలివి స్వామి!
ఇంతటి పంతము తగునా?
మీరుగూడ కుర్రవాని
తీరుగ భీష్మించెదరా?

అర్భకుండు తెలిసీ తెలి
యక దట్టి బిగించినంత
తల పండిన మీరలు సై
తము సై యని దూకెదరా?

మనకు కంటిపాప వంటి
తనయుని తెగటార్చి మీరు
గడియించెడి దేమున్నది?
కటిక చీకటులే తప్ప.

ఎవనికోసమై మీరీ
సవనము తలపెట్టితిరో
వాడే వలదన్నపుడీ
పాడు రాజ్యమెందుకయ్యా ?

వాడా అజ్ఞాని కాడు.
పైగా రణపండితుండు.
వానికి లేనట్టి తృష్ణ
వయసుడిగిన ముస కెందుకు?

ఆవేశాలకు లోనై
ఆత్మజు గోల్పోయెదమా ?
వేయి చేతులను మ్రొక్కెద
విడిచిపెట్టుడీ రాజ్యము."

మల్లికాంబ ఊరడింపు
మాటలలో కొన్నికొన్ని
యీటెలుగా దోచ హుంక
రించెను నాగమనాయుడు.

ఆమె మాటలను కాదను
నట్టి హేతుబలము లేక
'నోరు మూసికో' మ్మంచు వి
కారముగా గద్దించెను.

తనలోపలి ద్వంద్వ యుద్ధ
మును దమించుశక్తి లేక
వాకిట తిరుగాడెను సే
వకు లబ్బురపడి చూడగ.

మమత పొంగినప్పు డాతని
మనసు వెన్నయైపోయెను.
అహంత నిద్రించి సప్పు
డదియె రాయియైపోయెను.

కరగె వెన్నపూస; రాయి
గట్టిపడెను—నాయకుని క
న్నులలో చతురంగ బల
మ్ములు సందడి దందడించె.



# పంచమ ఖండం

గుండెపై కుంపటి రగుల్కొనగ పరుగెత్తి
పశ్చిమాంభోధి గర్భమున సూర్యుడుదూకె.

తన ప్రతాపమ్ము వార్ధక్యదోషోపహత
మైపోయె బ్రతుకెందుకని ముఖము దప్పించె.

చిర్రుబుర్రను అల్పచిత్తుల ముఖస్థితికి
ప్రతి బింబమటు లెర్రవడెను పడమటిదిక్కు.

ఒక భ్రష్టచేతసుని వికృతోహలకు బాహ్యా
రూపమో యన్నట్లు వ్యాపించెను తమస్సు.

మహిషాసురుండు జంబాల మందున మున్క
లిడి లేచినటు కన్పడెను పెంజీకట్లు.

అట్టి యిరులెగబ్రాకునట్టి నడురేయి నా
యందు నిద్రాపగతుడై చిర్రుముర్రాడె.

బలవంతముగ నేత్రములు మూసికొనె; మన
స్సొక గుడ్లగూబపోలిక యెగిసి కూవెట్టె.

మెలమెల్లగా నేత్రములు విప్పె; మేడముం
దటి వేపచెట్టు భూతమ్మటు జడల్ దులిపె.

రప్పుమనిగాడుపు తెరల్ వీచినప్పుడు న
క్కల వికారంపు ఊళలు చెవులలో దూరె.
కనులు కర్ణమ్ములేకాఁ; దతని పంచేంద్రి
యములన్ని వికటాట్టహాస చండములయ్యె.

అంతిపురిలో మల్లికాంబ ప్రేగులు చుట్ట
లుగ జుట్టుకొని యోగాదిగ చలింపగసాగె.
ఎడదకోతలకు సుడివడి పోయి మాటి మా
టికి నామె 'అయ్యో తండ్రీ' యంచు రోదించె.

కాలిపోయెడు దివ్విటీలు రాల్చెడు చనురు
బొ ట్లామె కన్నీటిబొట్లలో బింబించె.
రేయెల్ల అట్టుడికిపోయిన యెడందలో
తెలవారువేళ చల్వలనూదె నొక ఆశ.

అచట స్కంధావారమందు భగ్గున మండు
గుండెమంటల నార్పికొనె విశ్వనాథుండు.
ఘూర్ణిల్లిపోవు హృదయార్ణవములో నెటులొ
దాటింపనెంచె నిజధర్మ దీక్షా నౌక.

ఇటులముప్పురి చిగురుమనసుల
నెరియజేసిన రేయి విరిగెను.
కూలద్రోసెను తామసిక శ
క్తులను తేజస్సత్వ బింబము.

రేపుయుద్ధము; అబ్ధిచలదూ
ర్మికలవలె సేనలు కనంబడె.
సర్వసేనా పర్యవేక్షణ
సల్పుచుండెను విశ్వనాథుడు.

ఇంతలో వార్తావహుం డం
దించె నొక పత్రమ్ము; దానిని
చదువుకొని ఆలోచనా సం
ఛన్నుడయ్యెను ఖిన్నుడయ్యెను.

"అమ్మ తన కజ్జలితబాష్పము
లద్ది వ్రాసెను కమ్మ రమ్మని;
పోదునా వలదా" యనుచు తల
పోయసాగెను విశ్వనాథుడు.

"అమ్మకంట బడంగనే వ
జ్రమ్మువంటి మదీయ సంక
ల్పమ్ము నీరై పోవునో" యని
ఉమ్మలించ దొడంగె నాతడు.

"కన్నతల్లి నైన చూడగోరిన
కాదనుచు నేనెట్లు పల్కుదు"
నంచు వందురి తుదకు వచ్చెద
నంచు పంపెను వర్తమానము.

[illegible] నాయిన
సౌధమున కేగెను నిజాస్థగ
మద్భుటద్వయ మాత్రుడై సిం
హప్రతాపుడు విశ్వనాథుడు.

త్వరితగమనుం డౌచు కెఱ్ఱాం
తరములన్ దరియించె; నంతట
నంతిపురిలో శోక దేవత
యటుల నిల్చిన తల్లికన్పడె.

రెండు రెక్కలుసాచి 'నాతం
డ్రి'యనుచు ఎలుగెత్తి పిల్చుచు
ఒక్కపెట్టున వ్రాలి కొడుకును
రెక్క లందున మలచుకొనియెను.

తల్లి కౌగిట జన్మజన్మాం
తర పరిమళముల్ గుబాళిం
చినవిధమ్మున తోచి అమృత
స్థితిని పొందెను విశ్వనాథుడు.

అతనివక్షము తల్లికురిసిన
అశ్రువులతో తడిసిపోయెను
గాని సుంతయు మెత్తబడదు; వి
కారమెరుగరు ధీర చిత్తులు.

అతని నయనాంచలములందున
ఆగిపోయిన బాష్పకణముల
లోన రవ్వల దివ్వెటీ వె
ల్గులు తళతళలాడిపోయెను.

అతని తడికన్నులను తన ప
య్యంట నద్దుచు 'విశ్వనాథా'
యనుచు మాటలురాక 'విశ్వా'
యనుచు పైబడె మల్లికాంబిక.

తల్లి యెదలో మల్లడించిన
తల్లడింపు నెరింగి ఆవిడ
అశ్రుధారల తుడిచి యిటులో
దార్చసాగెను విశ్వనాథుడు.

ఎడద చుమ్మలుజుట్టగా దుః
ఖించకమ్మా కొడుకునై మీ
కిట్టి రాయిడి వెట్టినందుల
కెంతయో లజ్జింతునమ్మా!

మనిషిగానే యేల జన్మ
మ్మందితిని? ఏ పుట్టగానో
చెట్టుగానో పుట్టియుండిన
చిక్కు లుండకపోవునమ్మా!

పుట్టితినిబో! ఏల నాకీ
బట్ట గట్టించితివి? పైగా
చదువ జేసితి రెండు విధాల
సమ్ములను శాస్త్రాదికాయుధములను.
మీరు నాలో చిన్ననాడే
నూరిపోసిన అచ్చమౌ సం
స్కారమే ఈనాడు మిమ్మ్మ
సమరమున కీడ్చునది తల్లి!"

ఇటువలె వాపోవుచుండ
తటాలునన్ నాగము నా
యందు బయటినుండి బల్లె
మటుల దూసికొనివచ్చెను.
తనయునిగని దండతాడి
తభుజంగమువోలె రెచ్చి
ఒరలోపలి కరవాలము
పెరికి ముందునకు నడచెను.
తండ్రి వాలకమునకు చి
త్రంపడి విశ్వనాథుండు
ఛెళ్ళున తనఖడ్గము దూ
సెను లీలాక్రోధుండై.

రెండు సింగముల పోలిక
రెండు భుజంగములవోలె
రేగిన ఆత్మీయుల గని
ఊగిపోయె మల్లికాంబ.

తన కండ్లను తిమిరము కొరి
కిన యట్టుల బాధచెంది
'విశ్వా' యని పెద్దకేక
పెట్టి కూలిపోయె నామె.

తల్లి కేకతో గుండియ
తల్లడిల్ల కత్తి విసిరి
వైచి రొమ్ముసాచి నిలం
బడెను విశ్వనాథు డపుడు.

రౌద్రముతో ఆపాద శి
రస్కముగా నాయుడు కం
పించిపోదొడంగెను జళి
పించిన కరవాలమట్లు.

ముచ్చెమటలు వోసె; నతని
మోమున కళమాసె, కనులు
చింతనిప్పులను కురిసెను.
చేయి కొడుకుపై కురికెను.

అంతట సర్వాత దపి
మట్టుల విశ్వనాథుండు
దరహాసముతో నిల్చెను
స్థిరహాసముతో నిల్చెను.

నాగమనాయుండు కంప
న ప్రచండుడై పోయెను.
అతని అక్షులందు ముసిరె
నంధకార జటాచ్ఛటలు.

మనసు వణకె కనులు వణకె
తనువు సమస్తమ్ము వణకె.
వణకెను కుడిచేయి; జారె
పడిపోయెను విచ్చుకత్తి.

హుమ్మని వెన్కకు దిరిగి మ
హోగ్రముగా బుసకొట్టుచు
'ఓరి పితృద్రోహీ' యని
ఉరిమెను తన కసి దీరగ.

తండ్రి విసిరినట్టి వాక్కు
తనకు బల్లెమైనాటగ
'ఎట్టెట్టూ' యంచు హుంక
రించెను విశ్వనాథుండు.

"తండ్రిపైన ధ్వజమెత్తు కృ
తఘ్నా! నిన్నిప్పుడు తెగ
టార్చిన దిక్కెవ్వరురా"
యని గద్దించెను నాయుడు.

ఈషద్వక్రముగా వచి
యించె విశ్వనాథుడపుడు.
'అయ్యా! నా కన్నతండ్రి
అంతటి భీరువు కా'డని.

కదనుద్రొక్కు అహంకార
కంఖాణమునకు కళ్లెము
వేసి గుంజినట్లొకింత
వెన్కకు మొగ్గెను నాయుడు.

ఆయువు పట్లన్ని కదలి
నజ్జె; కీళ్లూడిపోయి
నజ్జె; పెనుబాధతోడ
పెట్లిపోయె నతనిగుండె.

దుఃఖరోషములు ముందుకు
త్రోసుకొని విజృంభించగ
పలుకసాగె నాతడు సం
చలితాధరుడై యిట్టుల.

గుండెరా! జగత్తులోన
పితృపాదుని పైకి కత్తి
పెరికిన దుష్టులు గలరా?

కలకాలము నీ రాయల
కాళ్లొత్తుచు బ్రతికెదవా?
ఒకరిని శాసించెడి జా
తకము తుడిచివేసెదవా?

ఒక పాండ్యుని మకరాశ్రువు
లకు నీ రాయలు నీవును
నీళ్ల తాకిడులకు ఇసుక
గూళ్లవోలె కరగితిరా?

ఔను, దుర్బలుని దొరతన
మే నీ రాయల కిష్టము.
గడిదేరిన వీరుని యే
ల్బడి రుచించు నెట్లతనికి?

ఇంతకు నేనెవరికోస
మీ బరువును మోసెదరా?
ఫలోన్ముఖమ్మగు నా స్వ
ప్నమును కూల్చివేసెదవా?

నిను దక్షిణదేశాధీ
శునిగా నొనరించుటకై
నే పన్నిన వ్యూహమ్మును
నెత్తుట ముంచెత్తెదవా?"

ఇటులనసాగె నాయని ఉ
త్కటరుషాకషాయిత ని
ర్వేదలహరి; దాని నోర్చి
విశ్వనాథు డిట్లనియెను.

"మీ మమతను త్రోసిపుచ్చ
గా మనసొప్పదు గానీ
అది ధర్మమునకు సంకెల
యైపోయిన సైచుటెట్లు ?

మీ రొకరికి బంటై యు
న్నారు గదా! వారి ఆజ్ఞ
లేక గడ్డిపుల్లయైన
చేకొనుట మహాద్రోహము.

ఏలిక నే ధిక్కరించి
యుత్తరుని రాజ్యమును దురా
క్రమణ చేసినార; లింత
కన్న ద్రోహమేది నాన్న ?

కన్నుల ముందర అధర్మ
కాండ జరుగుచున్నప్పుడు
మిన్నకుండు నట్టివాని
కన్న పాపి యెవడుండును ?

నాకు రాజ్యమెందుకు తం
డ్రీ ! కరుణాళువు రాయల
ఛాయలోనె నాకు స్వర్గ
సామ్రాజ్య సుఖమ్ము కలదు.

అక్రమముగ గడియించిన
అమృతమ్మైనను హేయము.
స్వధర్మ నిర్వహణములో
నిధనమ్మైనను శ్రేయము.

మీరు మాటిమాటికి నా
మేలుకోసమని యందురు
ఇదిసైతము స్వార్థమె; నే
నెవడను మీ వాడగదా.

ధర్మస్థాపనకు కన్న
తండ్రి కెదురు దాకినందు
కెట్టి పాపమైన నన్ను
జుట్టనీ అనుభవించెద.

ఒక్కమాట మరల మరల
నొక్కిచెప్ప సాహసింతు
స్వామిద్రోహము చేసిన
జనకుడైన శిక్షార్హుడు."

శాంత గభీరమ్మగు ఈ
సమాధాన పరంపరకు
నాగమనాయం డుద్వి
గ్న మనస్కుండై పోయెను.

అతని చురుకు చూపులు శూ
న్యమున నిప్పు ముట్టించెను.
అతని ఊహములు కత్తుల
యంచులకు పదును వెట్టెను.

విశ్వనాథుడొక సుదీర్ఘ
నిశ్వాసము విడిచి ఝటితి
గా 'సెల' వని కన్నతండ్రి
కాళ్లపైన ప్రణమిల్లెను.

తాను నిల్చియున్న నేల
దస్సున క్రుంగినయట్లని
పించగ నిలువెల్ల జలద
రించెను నాగమనాయుడు.

తండ్రి పాదములను పీడి
తన కాళ్లకు మ్రొక్కెడు కొడు
కును కౌగిటనద్ది భోరు
మని యేడ్చెను మల్లికాంబ.

గుండె రాయిజేసుకొని ఒ
కుమ్మడిగా తల్లి రెక్క-
లెటులో విదల్చుకొని నిష్క్ర-
మించెను విశ్వనాథుండు.

నగరమెల్ల గుర్రువెట్టి
నది; శిబిరమ్మున 'పహారా'
దిరుగు భటుల హెచ్చరికలు
దిగంతముల జీల్చుచుండె.

వినువీథిని బారులు దీ
రిన నక్షత్రములు సైని
కులు పట్టిన దివ్వెటీల
వలె కణకణ మండుచుండె.

తలలూపెడు వృక్షాగ్ర
మ్ములు సంగర రంగమ్మున
పరుగెత్తెడు అరదమ్ముల
పతాకమ్ములటు కన్పడె.

పౌరుష విస్ఫూర్తికి సం
బళిపాడిన యట్టివేళ
సాగె విశ్వనాథుడు చం
చత్ పాశుపతాస్త్రమట్లు.



# షష్ఠఖండం

ప్రళయకాలాంభోధి చలదూర్మికలయట్లు
విశ్వనాథుని చమూవిసరమ్ము గీపెట్టె.

పటహకాహళశంఖ చటులస్ఫుటార్భటీ
పటలితో దెసలన్ని బధిరీకృతములయ్యె.

కరిబృంహితములు తుఙ్కారహేషలు మహో
చ్చస్థాయి కెగిసి నిశ్శబ్దతకు దిగజారె.

పొగమంచువలె రుంద్రముగ ముసురుకొన్న పెం
ధూళిలో నిగళబద్ధుడు నాయ డగుపించె.

బోనులోబడ్డ బెబ్బులివోలె దమితక్రు
ధాసత్త్వుడై విషాదక్లాంతుడై నిల్చె.

చింతా వికీర్యమాణాంతరుండై విశ్వ
నాథు డగ్రస్యందనస్థుడై పయనించె.

వేరొక్కరథముపై వ్రీడామలీమసా
ననభాగుడైన నాయని మూర్తి కన్పట్టె.

వారి వెన్నంటు దుర్వార చతురంగ బల
ములు పొంగులారిన సముద్రమును తలపించె.

ఈవార్త కృష్ణభూభృన్మౌళి కందెను స
మీరత్వరా తిరస్కారి వేగముతోడ.

తన యెడదలో అద్భుతప్రహర్షములు మ
త్తడులు దూకన్ కృష్ణధరణీంద్రు డుప్పొంగె.

సరిగ నొక వారమ్ము జరిగెనోలేదో నగ
రిని విశ్వనాథాగమనవార్త వ్యాపించె.

కొడుకుచే ఇనుపగొలుసుల కట్టువడిన తం
డ్రిని జూడ కుతుకంపడెను విజయనగరమ్ము.

రేపకడ కొలువు దీర్చెను
కృష్ణరాయ మార్తాండుడు.
కొలువొక పద్మాకరమ్ము
వలె కలకల లాడుచుండె.

విశ్వనాథు డంతలో ప్ర
వేశించె సభాంతరమున;
తనతో నరుదెంచెడు నా
యని గొలుసులు ఖణిల్లనగ.

సభాసదులు విస్మయ వి
స్ఫార నేత్రులై మడమల
నెత్తి లేచిలేచి పరీ
క్షించిరి నాయని ముఖమ్ము.

తలపై ఒకవేయి మణుం
గుల బరువెత్తిన యట్టుల
నడువసాగె నాయుడు చిం
తాజడుడు వివర్ణముఖుడు.

గద్దెనుండి దిగి రాయుడు
కరయుగ్మముసాచి కౌగి
లించె విశ్వనాథుని తన
యెడద చెమ్మగిల్లి పోవ.

తండ్రి కవుంగిట నొదిగిన
తనయునివలె విశ్వనాథు
డపుడు చూరలాడెను రా
యల వాత్సల్యామృతమ్ము.

తన కౌగిటిలో కన్ని
ళ్లను రాల్చెడు విశ్వనాథు
గల్లమ్ముల నాప్యాయము
గా స్పర్శించెను రాయలు.

అవనతమస్తకుడౌ నా
యనిపై పాక దృక్కాలము
విసిరి విశ్వనాథుని తన
వెంటబెట్టుకొని నడచెను.

రాయలతో విశ్వనాథ
నాయుడు నడయాడుచుండ
సురసభలో ఇంద్రునితో
నరుగు పార్థుడనిపించెను.

తరళస్మితుడై రాయలు
తన సింహాసన పార్శ్వము
నన్ సలాంఛనముగ విశ్వ
నాథుని నాసీను జేసె.

రాయల పరిణద్ధమనః
స్థాయి కబ్రపడిపోయిన
సభ్యుల ముఖమండలముల
జయ నినాదములు మ్రోగెను.

ధర్మవీరమునకు జయ ప
తాకమైన విశ్వనాథ
మూర్తినిగని కవులడెంద
ములు కావ్యములై యెగిసెను.

పున్నమనాటి సముద్రము
పోల్కి పొంగులెత్తెడు ఓ
లగమునందు నిలువంబడి
రాజచంద్రు డిట్లనియెను.

"సభ్యులకు నాయని ఇటీవలి
చరితసాంతము విదితమేకద.
అది మహీరసమౌచు మాహృద
యాంతరమ్మును కలచివైచెను.

మాకు కుడిభుజమై రణాధ్వర
మండితుండైనట్టి నాయడు
చివరి దశలో దొడ్డిదారిని
ప్రవేశించెడు విద్యనేర్చెను.

తాను తెలిసియొ తెలియకో పం
కాన కాలిడెనన్న చెల్లును.
అడుసునే పన్నీరనుచు సం
దడియొనర్చుట యెంత మూర్ఖము.

కొడుకుకోసర మిట్టిచర్యకు
నడుముగట్టినయట్లు తెలిసెను.
అమృతభక్షణ సేయు వీరుడు
ఆశపడునా దొంగకూటికి ?

నాగమా ! నీవెంతలో ఎం
తటి కటుస్థితి దెచ్చుకొంటివి ?
గతచరిత్ర సుధాపథమ్మున
గరళమును పొంగించుకొంటివి.

నిన్ను పాతరవేసినన్ మా
కున్న కసి చల్లారిపోవదు.
ఈవొనర్చిన నేరమున కిం
కెట్టి దండనమైన చాలదు.

ఐన నిను మన్నించుచుంటిమి.
అత్యుదాత్త గుణప్రణీత హృ
దంతరుండగు విశ్వనాథుని
తండ్రివై యున్నావుగావున.

నీ కుమారునికీర్తి జాబిలి
రేకలై తెలిపాల నుర్వుల
వాకలై నీ నొసట నిల్చిన
వండుమచ్చను కడిగివేసెను."

సౌరవాహినివోలె బాహులు
సాచి వచ్చెడు కృష్ణరాయల
వాక్కులకు కొలువెల్ల పులకల
పంటపొలమై పరవశించెను.

విశ్వనాథుని యెడద యెత్తుకు
విస్తుపోయిన పాండ్యభూపతి
కృష్ణరాయల నుడులతో నో
క్కింతవడి విభ్రాంతుడయ్యెను.

అతనిలో పిసరంతగల రా
జ్యాశ త్రుటిలో నిగిరిపోయెను.
అతని హృదయము మబ్బుతొలగిన
అమృతరుక్ ప్రతిబింబమయ్యెను.

కడలి తరగలవోలె శబ్దిం
చెడి సభాగారాంతరమ్మున
విశ్వనాథుం డొక్కడే రూ
పించె దీపస్తంభమట్టుల.

ఏదో ఆర్పగరాని అస్ఫుట
వేదనాగ్ని జ్వాల ఆతని
గుండెలోపల రగులుకొని ముఖ
మండలమ్మున సెగలు రేపెను.

సుప్రశాంత దృశాంతములతో
చూచె నతనిని కృష్ణరాయలు.
విషము మ్రింగెడు విశ్వనాథుడు
వెన్నెలలు కురిపించె నంతట.

అతని భుజముల దట్టి దరహా
సాంకురమ్ములు అధరకేదా
రమ్మునన్ తులకింప కృష్ణధ
రావరుండు వచించె నిట్టుల.

"ఎన్ని జన్మల సౌహృదమో నీ
యున్న రూపున కదలివచ్చెను.
విశ్వనాథా! బండమైన ద్ర
వించు నీ చరితమ్ము విన్నను.

స్వామిభక్తికి ధర్మరక్తికి
నీ మనస్సొక పాలసంద్రము.
మా యశశ్శశిబింబమున కగు
నీ యునికియే నిత్యపర్వము.

నీవు జ్ఞానకృశాను దగ్ధా
నేక కర్ముడ; వాత్మహుత స
ర్వేంద్రియుండవు; అట్టి నిను గడి
యించు లెట్లొక సైనికుడుగా.

నీవు నైమిత్తికముగా జ
న్మించినావి నాగమయ్యకు.
కాని నీవుగ విశ్వనాథుని
కను వెలుగు మూర్తీభవించెను.

నిన్నుబోలు అలౌకిక ప్రతి
భోన్నతుడు మానీడలోపల
ఇంతకాల మొదిగియుండుట
యే విచిత్రమైన సంగతి.

నీవు బంటువు మేము ప్రభువను
నేమమింతటితోడ తీరెను.
మా సమానస్కంధుడవు సు
మ్మా! కుమారా! నేటినుండియె."

రాయలీగతి మంద్రగంభీ
రస్వరమ్మున పల్కగానే
పరమ హర్షోత్ఫుల్లముఖుడై
పాండ్యనృపతి వచించె నీగతి.

"నామనసు నావిష్కరించిన
వో మహాప్రభు! మీవచస్సులు.
మీరు పల్కినయట్లు కారణ
ధీరజన్ముడు విశ్వనాథుడు.

అతని ధర్మధ్వజపటాంచల
మస్మదంతరమందు రెపరెప
లాడిపోయినయప్పుడే రా
జ్యప్రలోభము చెదరిపోయెను.

చీటిమాటికి నదరిపడు నా
చేత పాండ్యప్రజల కేమి సు
ఖమ్ముగలదు? సమర్థునికి ప
ట్టమ్ముగట్టుట సాధుమార్గము.

విశ్వనాథునికన్న యోగ్యుడు
వేరెవడు ? నారాజ్యలక్ష్మిని
అతని చేతుల నుంచుడో రా
జాగ్రణీ ! నాఋణము తీరును"

ఇటుల పాండ్యుడు వినతిచేసెను.
కృష్ణరాయల గండయుగళము
పైన వెన్నెల విరియబూచెను.
పరిషదంబుధి పొంగు లేచెను.

వినయ వినమిత మస్తకుండౌ
విశ్వనాథుని వెన్ను నిమురుచు
ప్రభుండిట్లనె, "చూచినావా
పాండ్యభూపతి సుహృద్భావము.

నేటినుండియె విశ్వనాథా !
నీవు పాండ్యశ్రీయుతుడవై
దక్షిణాపథమందు శాంతి
ధ్వజము నాటుము; నీకు మేలగు."

ఇటుల కృష్ణరాయలు వచి
యించగ కొలువంతట మ
స్తకములూగె; జయజయ శ
బ్దము లబ్దము లట్లుమ్రోగె.

పాతాళపుటిరుల దిగం
బడి తడబడిపోయెడు నా
యడు హఠాత్తుగా సమతల
మందు చిమ్ముకొని వచ్చెను.

అతని ముఖము శతధా శక
లిత ముకురమై పోయెను.
అతని మనసు సంధ్యా శబ
లిత గగనస్థితి నొందెను.

వ్రీడాతాడిత చేతో
విక్రియుడై నేల బొటన
వ్రేల రాయుచు నిలంబడె.
ఓలగమ్ము గలగలమనె.

తనపై ఒక సహస్ర నే
త్రముల కాంతి కురియ విశ్వ
నాథుడు విజయుని పోలిక
నతమస్తకుడై నిల్చెను.

ఆతని హృదయము ద్వంద్వా
తీత సత్త్వపయస్సరో
వరమున అచ్ఛపు మీగడ
తరకయై ప్రదీపించెను.

తొలుత చెమ్మగిల్లిన చూ
పులతో రాయలను జూచి
పలికె నార్ద్రితా గభీర
గళ చలన్మృదు స్వరుడై.

"మహాప్రభూ! ఏమి చిత్ర
మయ్యా! బంటేమిటి రా
జగుటేమిటి? వదాన్యతకు
హద్దు పద్దులే లేవా?

నాకా రాజ్యమ్ము? గరిక
కా కిరీటమున స్థానము?
మీరు నడుచు దారుల ఈ
మేను పరచుకొన్న చాలు.

మీ నీడనుగల ఆత్మ సు
ఖానుభూతి రాచగద్దె
పై గలదా? మొగలిపూల
పానుపు నా కెందుకయ్య?

ప్రతిఫలమ్ము కొరకేనా?
ప్రాణమ్ములు పిండిపోసి
నను పెంచిన తండ్రిని కద
నమ్మిన కీడ్పినది ప్రభూ!

నేనేదో గొప్పచేసి
నానని మీరెంచినచో
అది మీ పరిణత దృష్టికి
అంచులు సాచిన పతాక.

యుగయుగాలనుండి వెల్గు
చుండిన ధర్మాగ్ని కుండ
మున నేనొక గరిటెడు నే
యిని బోసితి; నంతేకద!

తమకు నాయెడంగల ఔ
దార్యమునకు జన్మజన్మ
లకు ఋణపడి యుంటిగాని
రాజ్యము మాత్రమ్ము వలదు."

అతిలోకజ్ఞాన సుధాం
చితమైన విశ్వనాథ
వచస్సారమున సమస్త
పరిషత్తభిషిక్తమయ్యె.

క్రమక్రమమ్ముగా సభ్యు
ల ముఖమ్ములలోన నెదో
అసంతృప్తి యిరుల నీడ
లట్టుల పారాడసాగె.

సర్వము గమనించిన కృ
ష్ణోర్వీనాథుండు విశ్వ
నాథుని దెస ఆశాపూ
ర్ణ దృశాంచలములు సాచెను.

పునరుత్థితుడై పాండ్యుడు
వినతిచేసె 'విశ్వనాథు
డెట్టులైన రాజ్యేందిర
నేలుకొనక తప'దంచు.

రాయలందుకొనెను 'కుమా
రా! పాండ్యప్రజా శ్రేయ
మున కైనను నీ స్కంధ
మ్మున రాజ్యభరము తప్పదు'.

రాయల సౌహార్ద రస త
రంగిత వాక్కులు ఋుక్కులు
గా తోచెను విశ్వనాథ
చేతస్సాత్త్వక దృష్టికి.

దయాదుగ్ధసార గర్భి
తమ్మగు ఆతని హృదంత
రమున పాండ్యరాజ్యము వ
త్సము పోలిక క్రేళ్లురికెను.

అతడు 'ప్రభూ'! యంచనె; కొలు
వంత చెవులు రిక్కించెను.
అతడు 'సరే' యంచనె; కొలు
వంత యపుడె మిన్నందెను.

రాయలవదనము వికాస
రమ్యదీధితులు చిలికెను.
పాండ్యుని హృదయమ్ము హర్ష
పాథోనిధియై తొణకెను.

నాయుడు తలనెత్తె ; విశ్వ
నాథుడు తలదించె ; నిఖల
పారిషదుల హృష్టాత్మలు
పారిజాతములను కురిసె.

కొలువెల్ల ప్రగాఢమోద
విలోలిత స్థితి దాల్చెను.
విశ్వనాథు డొకడె గుప్త
వేదనాగ్నియై నిల్చెను.

తనయెదుట దిగాల్పడి ని
ల్చిన జనకుని చరణమ్ముల
పైబడి యనె 'తండ్రీ ! యీ
పాపిని క్షమియించు'మంచు.

ధర్మ హైమశిఖరాగ్ర
స్థాయియైన తనతనయుని
నమ్రతగని నాయని డెం
దము నందనమైపోయెను.

మాతాపితరుల ఆశీ
ర్మాలిక నౌదల ధరించి
సత్త్వ రజతశిఖరిపైన
సాగెను విశ్వనాథుండు.

విశ్వనాథ విభుని కృపా
వీక్షణ మొకపెట్టని కో
టగ నుండగ తాల్చెను పాం
డ్యశ్రీ విశ్వనాథుండు.

అతని యశోరేఖిక లిం
దందనగానేల పార్వ
ణేందువులో ప్రాకి దాని
కందును డిందగజేసెను.

అతని చరిత్రము ధర్మ
వ్రత పృతనాధిప కోటీ
రశ్రేణికి కలికి పచ్చ
లతురాయిని కైసేసెను.



